# మార్కో పోలో సాహస యాత్రలు

ఏడువందల ఏళ్ళక్రితం వెనిస్ నగరంలో ఇద్దరు అన్నదమ్ము లుండేవారు. పెద్దవాడు నికోలో పోలో, చిన్నవాడు మఫియో పోలో. వారు వర్తకం చేస్తూ అనేక దేశాలు తిరిగారు. వారు 1260 లో వర్తకంమీద కాన్స్టాంటినోపుల్ దాకా వెళ్ళి, అక్కడినుంచి తలపని తలంపుగా ఏడాదిపాటు ప్రయాణంచేసి ఎక్కడో చీనాదేశంలో ఉన్న తాతార్ చక్రవర్తి కుబిలాయ్ ఖాన్ వద్దకు వెళ్ళటం తటస్థించింది. ఆ కాలంలో యూరపు దేశంనుంచి ప్రాచ్య దేశాలకు ఆ విధంగా వెళ్ళిన వారెవరూ లేరు.

తాతార్లు మంగోలియా దేశానికి చెందిన ఒక తెగ. వారు అనాగరికులు. 1206 లో వారు తమ పుణ్యక్షేత్రమైన కారకోరం మైదానంలో సమావేశమై తమ నాయకుడుగా ఛింఘిజ్ ఖాన్ అనేవాణ్ణి ఎన్నుకున్నారు. ఛింఘిజ్ ఖాన్ పరిపాలన ప్రారంభమైన పన్నెండేళ్ళ లోపల వారు చీనా ఉత్తర ప్రాంతంలోని స్వతంత్ర దేశమైన కాతేను జయించి ఆక్రమించుకున్నారు. ఆ తరవాత వారు ప్రపంచమంతటినీ జయించటానికి తీర్మానించుకుని, ఇండోచీనా, ఇండియా, అరేబియా, పశ్చిమ యూరపు తప్ప మిగతా యూరపు ఆసియా ఖండాలను జయించేశారు. ఏ రాజ్యమూ లేకుండా దిగ్విజయానికి పూనుకున్న తాతార్లు రెండు తరాల కాలంలో, అదివరకు గాని ఆ తరవాతగాని ఎవరూ పరిపాలించనంత విస్తృతమైన సామ్రాజ్యాన్ని ఏర్పరచుకున్నారు. ఛింఘిజ్ ఖాన్ వారసులకు "పెద్ద ఖాను" అన్న బిరుదు సంక్రమించింది. కాతే అయన కింద ఉండేది. మిగిలిన సామ్రాజ్యమంతా ముగ్గురు చిన్న ఖానుల పరిపాలనకింద







పంచారు. వారు పెద్దఖానుకు లోబడి పాలన సాగించారు.

కాతేను పరిపాలించిన పెద్ద ఖానులలో కుబిలాయ్ అయిదోవాడు, ఆయన ఛెంఘిజ్ ఖాన్‌కు మనవడు. ఆయన పోలో సోదరులను గొప్పగా ఆదరించి, వారి ద్వారా ప్రపంచ రాజ్యాలను గురించి అనేక విషయాలు తెలుసుకుని, వారిని రోమునగరంలో ఉండే పోప్ వద్దకు తన దూతలుగా వెళ్లమని కోరాడు.

పోలో సోదరులు ఇందుకు సమ్మతించి ప్రయాణమై వచ్చేసరికి పోప్ చనిపోయాడనీ, కొత్త పోప్ ఎన్నిక ఇంకా జరగలేదనీ తెలి



సింది. అందుచేత వారు వెనిస్‌నగరానికి తిరిగి వెళ్లి, అక్కడ కొద్దికాలం ఉండి, పెద్ద ఖాను కనిపెట్టుకుని ఉంటాడన్న భయంతో మళ్లీ కాతేకు ప్రయాణమయారు.

ఈ ప్రయాణంలోనే వారివెంట మార్కోపోలో బయలుదేరాడు. పోలో సోదరులలో పెద్దవాడైన నికొలోకు మార్కో కుమారుడు. ఈ మార్కో పోలోయే తన తండ్రులవెంట కాతేకు వెళ్లి, అక్కడ పదిహేడేళ్లపాటు పెద్దఖాను కింద కొలువు చేసి అనంతరం స్వస్థలానికి వచ్చి తన ప్రపంచ పర్యటన అనుభవాలు రాసుకున్నాడు.



* * *

జార్జియాను పరిపాలించే రాజులందరికీ డేవిడ్ మాలిక్ (డేవిడ్ రాజు) అని పేరుండేది. ఈ రాజు తాతార్ల సామంతు. జార్జియా ప్రజలు అందమైనవాళ్ళు, మంచి యోధులు. అలెగ్జాండరు పడమటి దేశాల పైకి దండెత్తిపోతూ జార్జియాగుండా వెళ్ళలేకపోయాడు. ఎందుచేతనంటే అతను వెళ్ళవలిసిన దారి ఇరుకైనది; ఒక పక్క సముద్రం ఉన్నది, రెండవపక్క ఎత్తయిన కొండలూ, అశ్వారోహకులు ప్రవేశించటానికి సాధ్యంగాని అరణ్యాలూ ఉన్నాయి. కొండలకూ సముద్రానికీ మధ్య 14 మైళ్ళ పొడ












వున ఉన్న ఈ ఇరుకుదారిన ఎంతమంది వచ్చినా కొద్దిమంది సైనికులు ఆటంకపరచ వచ్చు. అందుకే అలెగ్జాండరు ఆ దారిన వెళ్ళలేకపోయాడు. జార్జియావారు తనపైన వచ్చి పడకుండా అలెగ్జాండరు ఇక్కడ ఒక బురుజూ, కోటా నిర్మించాడు. దాన్ని ఇనప ద్వారం అనేవారు.

జార్జియాకు ఉత్తరంగా నల్లసముద్రమూ, తూర్పుగా బకూసముద్రమూ, ఉన్నాయి. ఈ బకూ (కాస్పియన్) సముద్రం నిజంగా సముద్రం కాదు, ఒక బ్రహ్మాండమైన సరస్సు; దాని చుట్టుకొలత 2,800 మైళ్లు. దీనిలో జనం నివసించే లంకలూ, అందమైన నగరాలూ ఎన్నో ఉన్నాయి.

బాగ్దాదులో ముత్యాలకు రంధ్రాలు వేసే నిపుణులుండేవారు. ఇండియానుంచి ముత్యాలు ఇక్కడికి వచ్చి ఇక్కడినుంచి క్రైస్తవ దేశాలకు ఎగుమతి అయేవి. ఇక్కడ బంగారు పోగులతోనూ, వెండి పోగులతోనూ వస్త్రాలు నేసేవారు. ఆ ప్రాంతాల అంత గొప్ప నగరం మరొకటి లేదు. అక్కడ ముస్లిము మతధర్మాలే గాక, ఇంద్రజాల విద్యా, ఇతర శాస్త్రాలూ నేర్చుకునేవారికి సౌకర్యాలుండేవి.

ప్రపంచంలో ఏ వ్యక్తికీ లేనంత సంపద ఖలీఫావద్ద ఉండేది. 1258 లో ఒక సంఘటన జరిగింది. హులగుఖాన్ అనే వాడు గొప్ప తాతారు సైన్యంతో బాగ్దాదు పైకి దండెత్తి వచ్చాడు. ఇతను మొంగుఖాన్ తమ్ముడు. వారు నలుగురు అన్నదమ్ములు. వారు కాతేను జయించినాక ప్రపంచాన్నంతా జయించ బూనుకుని, నాలుగు దిశలూ నలుగురూ పంచుకున్నారు. దక్షిణదిశ హులగు వంతుకు వచ్చింది. ఆయన దిగ్విజయం చేసుకుంటూ బాగ్దాదు దాకా వచ్చాడు. బాగ్దాదు బలంతో వశం కావటం దుర్ఘటమని ఆయన దానిని యుక్తితో జయించ నిశ్చయించాడు. ఆయన వెంట కాల్బలం కాక, ఇరవైవేల అశ్విక







సైనికులున్నారు; అయినా ఆయన తనవెంట చాలా స్వల్ప బలాలున్నట్టు ఖలీఫాకు తోచే లాగ చేశాడు. బాగ్దాదు చేరబోయేముందు ఆయన తన సైనికులలో హెచ్చుమందిని దారికి అటూఇటూ గల చెట్ల తోపులలో దాచాడు, మిగిలిన సైన్యంతో ఆయన బాగ్దాదు ద్వారంపై దాడిచేశాడు.

ఖాన్ వెంట ఉన్న సైన్యం చాలా కొద్ది పాటిదని ఖలీఫా అలక్ష్యంగా తన బలాలతో శత్రువును ఎదుర్కొవచ్చాడు. ఇది చూచి హులగు పారిపోతున్నట్టు అభినయించాడు. ఖలీఫా బలాలు మోసపోయి శత్రువును వెంబడించి, మాటులో చిక్కుకుపోయాయి. వారిని హులగుఖాన్ బలాలు చుట్టుముట్టి నిర్మూలించేశాయి. బాగ్దాదు నగరంతోబాటు ఖలీఫాకూడా తాతార్ల వశమయాడు.

తరవాత హులగు ఒక బురుజునిండా బంగారం దాచిఉండటం చూసి నిర్ఘాంత పోయాడు. బందీ అయిన ఖలీఫాను తన వద్దకు రప్పించి, "ఖలీఫా, ఈ బంగార మంతా ఇలా ఎందుకు పేర్చి పెట్టావు? దీనితో ఏంచేద్దా మనుకున్నావు? నిన్ను దోచుకోవటానికి నేను సైన్యాలతో వస్తున్నా నని ఎరగవా? దీనినంతా నీ సైనికులకూ, యోధులకూ పంచిపెట్టి నగర రక్షణ చేయ మని ఎందుకు కోరలేదు?" అని అడిగాడు.

దీనికేమనాలో తెలియక ఖలీఫా ఉలకక పలకక ఊరుకున్నాడు.

"నీకు ధనమంటే అంత ప్రీతి గనక నీ ధనం నీవే భోజనం చెయ్యి!" అంటూ హులగు, ఖలీఫాను బురుజులో బంధించ మనీ, తినేటందుకేమీ ఇవ్వవద్దనీ ఉత్తరువు చేశాడు. నాలుగు రోజులపాటు ఆ బురుజు లోనే ఉండి అనంతరం ఖలీఫా మరణిం చాడు. ఆ తరవాత ఖలీఫాలు మరి లేరు.

—(ఇంకా వుంది)





## 2

పర్షియా చాలా పెద్దదేశం. అందులో ఎనిమిది రాజ్యాలుండేవి—కాస్విన్, కుర్దిస్తాన్, లురిస్తాన్, షులిస్తాన్, ఇస్ఫహాన్, షిరాజ్, షబన్‌కారా, తూన్‌కైన్‌లు.

ఈ దేశాలలో మేలుజాతి గుర్రాలుండేవి. అవి ఇండియాకు ఎగుమతి అయేవి. ఇక్కడి గాడిదలకు కూడా మంచి గిరాకీ ఉండేది, ఎందుకంటే ఇవి ఎక్కువ తిండి కోరకుండానే, గుర్రాలూ కంచరగాడిదలూ మోయలేని బరువులను ఎంతోదూరం చేరవేసేవి. ఒక దేశంనుంచి ఇంకొక దేశానికి ఎడారిమీదుగా వెళ్ళే వర్తకులకు ఇవి చాలా ఉపయోగకరంగా ఉండేవి.

ఈ రాజ్యాలలో నివసించేవారు దుర్మార్గులు, క్రూరులు. వీరివల్ల వర్తక ప్రయాణీకులకు అపాయమూ, నష్టమూ కలగకుండా తాతార్ పరిపాలకులు ఎన్నో కట్టుదిట్టాలు చేశారు. అప్పటికీ వారు దుశ్చర్యలు మానేవారు కారు. అందుచేత వర్తకులు బాణాలూ, ఆయుధాలూ వెంట ఉంచుకోవలిసివచ్చేది.

పర్షియాలోని ప్రముఖ నగరాలలో యాజ్డ్ ఒకటి. ఇది చాలా అందమైన నగరం, పెద్ద వర్తక కేంద్రం కూడానూ. ఇక్కడినుంచి ఏడు రోజులు ప్రయాణిస్తే కర్మాన్ అనే రాజ్యం వచ్చేది. ఇది పర్షియా సరిహద్దున ఉన్నది. ఇక్కడి కొండలలో తవ్వితే వైడూర్యపు మణులు విరివిగా దొరికేవి. ఇక్కడ







ఉక్కుతో యోధులకు కావలిసిన అయుధ సామగ్రి తయారుచేసే నిపుణులుండేవారు.

కర్మాన్‌రాజ్యం గురించి ఒక చిత్రమైన కథ ఉన్నది. ఇక్కడి ప్రజలు శాంతస్వభావులు, పరోపకారపారీణులు, సౌమ్యులు. ఒకసారి కర్మాన్‌రాజు మేధావుల నందరినీ సమావేశపరిచి, "మన పొరుగున ఉండే పర్షియాలో ప్రజలు ధూర్తులూ, దుష్టస్వభావులూ, హంతకులూ అయిఉన్నప్పటికీ మన ప్రజలు సౌమ్యులూ, సజ్జనులూ అయి ఉండటానికి కారణమేమిటి? ఈ సందేహం నన్ను మహా వేధిస్తున్నది," అన్నాడట. ఈ తేడా మట్టిలో ఉన్నదని మేధావులు ఏకగ్రీవంగా



చెప్పారట. వెంటనే రాజు తన మనుషులను ఇస్ఫహానుకు పంపి ఏడు ఓడలనిండా మట్టిని అక్కడినుంచి తన రాజ్యానికి తెప్పించాడట. ఆ మట్టిని కొన్ని గదులలో వేయించి, దానిపైన తివాసీలు పరిపించి, ఆ గదులలో తన ప్రజలకు విందు చేయించాడట. విందు ఇంకా పూర్తి కాకమునుపే ఆ ప్రజలు వాగ్వాదాలకు దిగి, తన్నుకోవటానికి ఉపక్రమించారట. ఈ విధంగా మేధావులు చెప్పిన మాట రుజువయింది.

కర్మాన్ నగరంనుంచి బయలుదేరి తొమ్మిదిరోజులు ప్రయాణంచేస్తే రుద్బార్ అనే దేశం వస్తుంది. ఇక్కడ కరౌనా అనే జాతికి చెందిన బందిపోటు ముఠాలున్నాయి. కరౌనాలు మిశ్రమజాతివారు, తాతార్ తండ్రులకూ భారతదేశపు తల్లులకూ పుట్టినవారు. నిగుదార్ అనేతాతార్ రాజు పదివేలమంది సైనికులను వెంటబెట్టుకుని ఆర్మీనియానుంచి బదఖ్‌షాన్, పాషాయ్, కాశ్మీర్ దేశాలుదాటి దిలివార్ అనే రాజ్యంమీద వచ్చిపడి, అక్కడ రాజుగా ఉంటున్న అసిదీన్ సుల్తాన్ అనేవాణ్ణి తరిమేసి తానే రాజు అయాడు. అతడివెంట ఉన్న తాతార్లు భారతీయ స్త్రీలకు కన్న సంతానమే కరౌనాలు. వీళ్లు మలబారునుంచి మంత్రశక్తులు సంపా












దించారట; పట్టపగలే చీకటి కల్పించి వర్తకులను దోచుకుని, తమకు చిక్కిన మనుషులను చంపి, చిన్నవాళ్లను బానిసలుగా అమ్మేసేవారు.

రుద్బార్ మైదానాలు సుక్షేత్రమైనవి. హొర్ముజ్ రేవు చేరి భారతీయ వర్తకుల రాకకోసం ఎదురుచూసేవారు తమ ఒంటెలనూ, కంచర గాడిదలనూ ఈ మైదానాల పైన మేయటానికి పంపేవారు. అందుచేత కరౌనాలు ఈ ప్రాంతంలో జాస్తిగా సంచరించేవారు. మార్కోపోలో ఎలాగో వీరివాత పడకుండా తప్పించుకోగలిగాడు.

ఇక్కడినుంచి హొర్ముజ్ రేవుకు రెండు రోజుల ప్రయాణం. ఇది గొప్ప వర్తక కేంద్రం. ఇక్కడ వేడి చాలా జాస్తి.

కెర్మాన్ నుంచి ఉత్తరంగా ప్రయాణించే వారికి ప్రయాణం బహు ప్రయాసతో కూడుకున్నది. మూడురోజులపాటు దారిలో దాదాపు మంచినీరే దొరకదు. ఆ తరవాత ఒక అంతర్వాహిని అయిన నది వస్తుంది. ఆ తరవాత మరి నాలుగు రోజులు నిర్జల ప్రాంతంలో ప్రయాణించాక కూబనాన్ అనే నగరం వస్తుంది. ఇక్కడినుంచి తూన్‌కైన్ రాజ్యాలకు ఎడారి మీదుగా ఎనిమిది రోజుల ప్రయాణం. ఈ రాజ్యాలు పర్షియా ఉత్తర సరిహద్దులో ఉన్నాయి. ఇక్కడ ఒక అంతులేని మైదానం ఉన్నది, అందులో "ఏకాంత వృక్షం" ఉన్నది. ఈ చెట్టుకు ఒక దిశగా పదిమైళ్ళ దూరంలోనూ, మిగిలిన దిశలలో నూరుమైళ్ళలోనూ చెట్టు అనేది లేని కారణంచేత దీనికి "ఏకాంత వృక్షం" అని పేరు వచ్చింది.

తరవాత ములహత్ అనే దేశం వస్తుంది. ఇక్కడ ఒకప్పుడు ఒక "కొండదొర" ఉండేవాడట. అతడి పేరు అలాఉద్దీన్. అతడు రెండు కొండలమధ్య గల లోయలో ఒక అద్భుతమైన తోట వేయించి, అందులో దివ్యమైన భవనాలు అనేకం కట్టించాడట.



35





వాటిలో అప్సరసల్లాటి స్త్రీలను ఉంచి, ఆ ప్రాంతం స్వర్గమనే భ్రమ కలిగేలాగు చేశాడు. మహమ్మదు ప్రవక్త స్వర్గాన్ని వర్ణించినట్టుగానే పాలూ, నీరూ, సారా, తేనే కాలవలుగా ప్రవహింపజేశాడు.

ఆయన ఎవరిచేతనైనా తనకు గిట్టని వాళ్ళను హత్యా చేయించదలచినప్పుడు ఆ మనుషులను తన కోటలోకి ప్రవేశించనిచ్చి, వారికి మత్తుపదార్థాలు పెట్టి, మైకంలో వుండగా తన తోటలలో స్త్రీల మధ్యకు చేర్చేవాడు. స్పృహ వచ్చాక వారు తాము నిజంగా స్వర్గం చేరామనుకునేవారు.

వారిని హత్యలు చేయటానికి పంపదలిచినప్పుడు తిరిగి వారికి మత్తుమందు పెట్టి తన కోటలోకి తెప్పించేవాడు. స్పృహ రాగానే వారు తాము స్వర్గానికి దూరమై పోయామని దిగులుపడేవారు.

"మీరు తిరిగి స్వర్గానికి పోదలచినట్టయితే ఫలాని రాజును చంపండి. మీకు తిరిగి స్వర్గంలో ప్రవేశం ఇప్పిస్తాను," అనేవాడు. ఎవరిని చంపించటానికి ఏయే మనుషులను పంపాలో "కొండదొర" చాలా జాగ్రత్తగా నిర్ణయించేవాడు.

వాళ్ళు పని పూర్తిచేసి తిరిగి తన కోటకు వచ్చాక వారికోసం బ్రహ్మాండమైన విందులు చేసేవాడు.

ఆ అమాయకులు అడివరకే తాము స్వర్గంలో ఉన్నామనుకున్నారు గనక వారు చావును లక్ష్యపెట్టేవారు కారు.

చిన్నఖానులలో ఒకడైన హులగు ఈ "కొండదొర" గురించి విని వాణ్ణి హతమార్చటానికి 1262 లో గొప్ప సేనను పంపాడు, ఆ సేన వచ్చి కొండదొర కోటను మూడేళ్ళు ముట్టడించాక లోపలివారికి తిండిలేక లొంగిపోయారు. తాతార్లు కొండదొరనూ, అతని చేతిలో కీలుబొమ్మలైన హంతకులనూ చంపేసి ఒక పెద్ద పీడ విరగడ చేశారు. —(ఇంకా వుంది)







## 3

కొండదొర కోట ఉండిన ప్రాంతం చాలా ఫలసమృద్ధి గలది. ఈ దేశం దాటటానికి ఆరు రోజులు పడుతుంది. తరవాత పెద్ద పెద్ద ఎడారులు తగిలాయి. వాటిలో కొన్ని యాభై, అరవై మైళ్ళ విస్తీర్ణం కలవి. ఎక్కడా ఒక్క చుక్క నీరు దొరకదు.

ఈ దారిలో బాల్ఖ్ అనే నగరం తగులుతుంది. ఇది ఒకప్పుడు మహానగరంగా ఉండేదట. కాని దీనిని తాతార్లూ, ఇతరులూ కొల్లగొట్టి నాశనం చేశారు. ఎన్నో గొప్పగొప్ప చలవరాతి భవనాల శిథిలాలు ఇంకా కనిపిస్తూనే ఉన్నాయి. ఈ నగరంలోనే మహా యోధుడైన అలెగ్జాండరు డేరియస్ అనే పర్షియారాజు కుమార్తెను పెళ్ళాడాడని ప్రతీతి. ఇక్కడినుంచి జన సంచారం లేని మార్గాన ఈశాన్య దిశగా పన్నెండు రోజులు ప్రయాణిస్తే తాలిఖాన్ అనే నగరం వస్తుంది. ఈ నగరానికి దక్షిణంగా ఉన్న కొండలలో ఉప్పుగనులున్నాయి. వీటిలో ప్రపంచానికంతకూ ఎప్పటికీ సరిపడేటంత ఉప్పు ఉన్నది!

అలెగ్జాండరుకూ, డేరియస్ కుమార్తెకూ పుట్టిన సంతతివారు ఏలే దేశం పేరు బదఖ్షాన్. ఇక్కడ ఒక కొండలో కెంపులు దొరికే గనులున్నాయి, మరొక కొండలో నీల మణులు దొరుకుతాయి. ఇది సమృద్ధి అయిన ప్రాంతం. చలి జాస్తి. కొండదారులు









కాష్గర్, సమర్కండ్, యార్కండ్ అన్న దేశాలు వస్తాయి.

ఖోటాన్ నగరం అదే పేరుగల దేశానికి రాజధాని. ఇది పెద్దఖాను సామ్రాజ్యం లోది. ఈ దేశంలో సంపన్నమైన నగరాలు చాలా ఉన్నాయి. పత్తి బాగా పండుతుంది. ద్రాక్షతోటలూ, పళ్లతోటలూ కొల్లలుగా ఉన్నాయి. కాష్గర్ నుంచి పెమ్ అనే దేశం దాకా తుర్కిస్తానం అంటారు.

కాష్గర్ దాటినది మొదలు నేల అంతా ఇసకపర్రలే, కాని అసలు ఎడారి లోప్ అనే నగరం అవతల ప్రారంభమవుతుంది. ప్రయాణీకులు ఈ నగరంలో విశ్రాంతి తీసుకుని నెలరోజులపాటు తమకూ, జంతువులకూ కావలిసిన సంబారాలు తీసుకుని ఎడారి ప్రయాణం సాగిస్తారు. ఎడారి నిడివి చాలా తక్కువగా ఉన్నచోట దాటటానికి నెల పడుతుంది; ఎక్కువగా ఉన్నచోట దాటటానికి పూర్తిగా ఏడాది పట్టుతుందట.

ఈ ఎడారి దాటటం చాలా ప్రమాదకరం. ప్రయాణీకుడు వెనకబడి గాని, అందరితోబాటు నిద్ర లేవకగాని ఒంటరిగాడైపోతే వాడు మృత్యువు వాత పడినట్టే. వాడికి ఎటునుంచో మాటలు వినవస్తాయి, తనను ఎవరో పిలిచినట్టు వినిపిస్తుంది,

దుర్గమంగా ఉండటంచేత శత్రుభయం లేదు. కొండలమీది గాలి ఎంత నిర్మలమైనదంటే ఆ గాలికే అనేక వ్యాధులు నయమవుతాయి.

ఇక్కడినుంచి పామిర్ పీఠభూమికి పద్దెనిమిది రోజుల ప్రయాణం. పామిర్ ప్రపంచంలోకెల్ల ఎత్తయిన సమ ప్రదేశమని చెబుతారు. ఈ పీఠభూమి ప్రాణిరహితమైనది. దీనిని దాటటానికి పన్నెండు రోజులు పట్టుతుంది. దీనిని దాటి కొండల మీదుగా, వాగులమీదుగా నలభై రోజులు ప్రయాణించాక బెలోర్ అన్న దేశం వస్తుంది. ఇక్కడినుంచి ఇంకా ముందుకు పోతే









ఒక్కొక్కప్పుడు వాడికి ప్రయాణీకులు కూడా కళ్లకు కనిపించినట్టవుతుంది. ఇవన్నీ భ్రమలని తెలియక వాడు వాటిని నమ్మి దారి తప్పిపోతాడు. ఇలా ప్రాణాలను పోగొట్టుకున్న ప్రయాణీకులు చాలామంది ఉన్నారు. అందుచేత ఎడారి దాటే ప్రయాణీకులు పొరపాటునకూడా ఒకరికొకరు దూరం కారు.

ఈ పెద్ద ఎడారి అవతల కాముల్ అనే దేశమూ, దాని అవతల మరొక చిన్న ఎడారీ ఉన్నాయి. ఈ ఎడారులన్నీ గడిచాక టాన్గుట్ అనే దేశం వస్తుంది. అందులో సూచౌ, కాన్‌చౌ మొదలైన గొప్ప నగరాలున్నాయి. దీనిని దాటిపోతే కారకోరం అనే నగరం, మూడుమైళ్ళ నిడివిగలది వస్తుంది. తాతార్లు తమ దేశం విడిచి వచ్చాక దీనినే తమ నివాసం చేసుకున్నారు.

ఈ తాతార్లు ఆదిలో మంచూరియాలోని చోర్చా ప్రాంతంలోనూ బైకల్ సరస్సు ప్రాంతంలోనూ ఉండేవారు. ఇక్కడ మైదానాలూ, జలసమృద్ధీ ఉండేవిగాని జనవాసాలు లేవు. వారికి ఒక నాయకుడు లేడు, కాని ఉంగ్‌ఖాన్ అనేవాడికి కప్పం కట్టి అతనికి లోబడి ఉండేవారు. ఈ ఉంగ్‌ఖాన్‌కు ప్రెస్టర్‌జాన్ అనికూడా పేరుండేది.

తాతార్ల సంఖ్య నానాటికీ పెరిగిపోతూండటం చూసి ప్రెస్టర్ జాన్ వారిని ముఠాలుగా చీలదీసి వేరువేరు ప్రాంతాలకు పంపాలనుకున్నాడు. ఈ సంగతి తెలియగానే తాతార్లు మూక ఉమ్మడిగా ఒక ఎడారిలోకి వెళ్ళిపోయి అక్కడ నివాసం ఏర్పాటుచేసుకుని ప్రెస్టర్ జాన్‌కు కప్పం కట్టటం మానేశారు.

కొంతకాలం గడిచాక ఈ తాతార్లు ఛింఘిజ్‌ఖాన్‌ను తమకు రాజుగా ఎన్నుకున్నారు. అప్పుడు ప్రపంచమంతటా ఉండే తాతార్లందరూ ఆయనను తమ రాజుగా ఆమోదించారు. వారి సంఖ్య అపారం. ఇంతమంది తనవెంట ఉన్నారని







తెలిసి ఛెంఘిజ్ ఖాన్ వారందరికీ బాజాలిచ్చి దిగ్విజయానికి బయలుదేరాడు. అతను న్యాయమైన పరిపాలకుడు కావటంచేత అతనిచేత ఓడినవాళ్ళుకూడా అతని అనుచరులుగా చేరారు.

అతను ప్రెస్టర్‌జాన్ కుమార్తెను పెళ్లాడతానని కబురుచేశాడు. ప్రెస్టర్ జాన్‌కు మండిపోయింది. "వీడు నా బానిస. వీణ్ణి నిర్మూలిస్తాను," అన్నాడాయన. ఈ సంగతి విని ఛెంఘిజ్ ఖాన్ పట్టరాని ఆగ్రహంతో, తన బలాలను తరలించుకుని ప్రెస్టర్ జాన్‌తో యుద్ధం చెయ్యటానికి వచ్చాడు.

ఛెంఘిజ్ ఖాన్ వస్తున్నాడని తెలిసి ప్రెస్టర్ జాన్ భయపడలేదు. ఆయన తన సైన్యాన్ని సమాయత్తపరిచాడు. అదికూడా చాలా పెద్ద సేనే. ఛెంఘిజ్ ఖాన్ తన సేనలను టెండుక్ మైదానంలో విడియింపజేశాడు. ఆయన దైవజ్ఞులను సంప్రతించగా యుద్ధంలో విజయం ఆయనదేనని చెప్పారు. మరిరెండు రోజుల అనంతరం ప్రెస్టర్ జాన్ సేనలు ఆ మైదానం చేరాయి. రెండు పక్షాలకూ మధ్య అపూర్వమైన యుద్ధం జరిగింది. ఉభయపక్షాలా తీవ్రమైన జననష్టం జరిగింది. కాని ఛెంఘిజ్ ఖాన్ గెలిచాడు. ప్రెస్టర్‌జాన్ యుద్ధరంగంలో చనిపోయాడు. తరవాత ఛెంఘిజ్ ఖాన్ ప్రెస్టర్ జాన్ కూతుర్ని పెళ్లాడినట్టు కొందరు చెబుతారు. ఆయన ఈ యుద్ధం ముగిసినాక ఆరేళ్ళపాటు రాజ్యంచేసి చాలా నగరాలూ, దేశాలూ జయించాడు. తరవాత ఆయన హెూచౌ అనే నగరంపై దాడిచేసేటప్పుడు మోకాలులో బాణం గుచ్చుకున్నది. ఆ గాయంతోనే ఆయన చనిపోయాడు.

ఛెంఘిజ్ ఖాన్ అనంతరం కుయుక్ ఖాన్ బాటూఖాన్‌లు పెద్దఖాన్‌లుగా పరిపాలించారు. మార్కోపోలో కాలానికి పెద్దఖాను కుబిలాయిఖాను. ఈయన సామ్రాజ్యం మిగిలిన పెద్దఖానులందరి సామ్రాజ్యాలనూ మించినది —(ఇంకా వుంది)






## 4

ఛింఘిజ్ ఖాన్ వంశంవారు చనిపోతే వారి శవాలను అల్టాయ్ పర్వతంవద్ద పాతి పెట్టటం ఆచారం. వాళ్ళు ఆ పర్వతానికి నూరురోజుల ప్రయాణపు దూరంలో ఉన్నా సరే శవాన్ని అక్కడికి మోసుకుపోవాలి. దారిలో ఎదురైన వారందరినీ చంపి, "వెళ్ళి లోకాంతరంలో పెద్ద ఖానుకు సేవ చెయ్యి," అనేవారు. అలాగే దారిలో కనిపించిన గుర్రాలన్నిటినీ ఆయనకోసం చంపేవారు. మొంగూ ఖాన్ చనిపోయినప్పుడు ఆయన శవానికి ఎదురైనవారిని ఇరవైవేలమందిని పెద్ద ఖాను అనుచరులు ఈవిధంగా చంపినమాట వాస్తవం. పెద్ద ఖాను చనిపోగానే ఆయనకు గల గుర్రాలలో ఉత్తమమైన వాటన్నిటినీ కూడా చంపటం ఆచారం.

ఈ సందర్భంలో తాతార్లను గురించి తెలుసుకోదగిన విషయాలు కొన్ని ఉన్నాయి. వాళ్ళు ఎప్పుడూ ఒకచోట ఉండక శీతాకాలాన ఉష్ణప్రాంతాలా, వేసవికాలాన చల్లనిప్రాంతాలా నివసిస్తారు. వాళ్ళ ఇళ్ళు చెక్కలతో గుండ్రంగా నిర్మించినవి; నాలుగు చక్రాల బళ్ళపైన ఎక్కించి తీసుకుపోవటానికి వీలుగా, చాలా తేలికగా ఉంటాయి. వర్షాకాలంలో వాళ్లు బళ్లలో ప్రయాణిస్తారు. ఈ సవారీ బళ్లలో ఒక్క చినుకు వర్షం కురవదు; వీటిలోనే వారి కాపరాలూ, వంట సామగ్రీ అన్నీ ఉంటాయి.







తాతార్ స్త్రీలే ఇంటి పనులూ, క్రయ విక్రయాలు చేస్తారు. వేటాడటమూ, యుద్ధం చెయ్యటమూ, డేగలతో వేటా మాత్రమే మగ వాళ్ళ పని. వారు గుర్రపు మాంసమూ, కుక్క మాంసమూ కూడా తింటారు. గుర్రపు పాలు తాగుతారు. పది, ఇరవైమందికూడా ఒకే కుటుంబంగా జీవిస్తారు. అయితే వారి మధ్య ఎట్టి వైషమ్యాలూ, పేచీలూ ఉండవు. పిల్లలను ఉమ్మడి సొత్తుగా చూస్తారు. తాతార్ పురుషులు పోషించగలిగితే నూరు మంది స్త్రీలనుకూడా పెళ్ళాడవచ్చు.

వారు సర్వేశ్వరుణ్ణి నమ్మి ధ్యానిస్తారు. ఈ సర్వేశ్వరుడు వివేకాన్ని, దేహారోగ్యాన్ని



పెంపొందిస్తాడని వారి నమ్మకం. తరవాత వారు గృహదేవతల విగ్రహాలను పెట్టుకుని పూజిస్తారు. భోజనం చేసేముందు ఆహారాన్ని గృహదేవతలకు నైవేద్యంపెడతారు.

వారు అసాధారణ శౌర్య సాహసాలు గలవారు. ఎటువంటి కష్టాలకైనా తట్టుకో గలవారు. ఆకలి దప్పులకు ఓర్చి, రోజుల తరబడి గుర్రం దిగకుండా వారు పోరు సాగించగలరు. యుద్ధరంగం నుంచి పారి పోవటం వారికి ఓటమి కాదు. పారిపోతూ కూడా వారు వెనక్కు తిరిగి తమను వెంటాడే శత్రువును బాణాలతో గురిగా కొట్టగలరు. ఈవిధంగా శత్రువును బలహీనపరిచి వారు యుద్ధంలో అంతిమ విజయం సాధిస్తారు. అందుచేతనే వారు యుద్ధాలు చేసి అంత ప్రపంచాన్ని స్వాధీనపరుచుకోగలిగారు. వారు దిగ్విజయం నిమిత్తం దూర ప్రయాణాలు చేసేటప్పుడు ఆహారం వెంట పట్టుకు పోరు. మరే ఆహారమూ లేకపోతే తమ గుర్రాల రక్తనాళాలనుంచి రక్తం తీసి దానిని తాగుతారు. వారి ప్రధాన సంపద గుర్రాలూ, ఒంటెలూ, ఎద్దులూ, ఆవులూ, గొర్రెలూనూ.

తాతార్లలో ఒక వింత ఆచారం ఉంది. ఒకడి కూతురూ, మరొకరి కొడుకూ చని పోయినప్పుడు, ఆ ఇద్దరి ఆత్మలకూ శాస్త్రో







క్తంగా వివాహం జరిపించి వారి తండ్రులు వియ్యమందుతారు! ఆ బంధుత్వం తర తరాల అలాగే ఉండిపోతుంది.

కాతేకు వెళ్ళే దారిలో పెద్దఖాను మకా ములు చాలా ఉన్నాయి. "చగన్ నోర్" (తెల్ల మడుగు) అనేచోట పెద్దఖాను రాజ సౌధం ఒకటి ఉన్నది. ఇక్కడ అనేక నదులూ, సరస్సులూ, వాటిలో హంసలూ, వేటాడదగిన అనేక పక్షులూ ఉంటాయి. వేటకోసం పెద్దఖాను ఇక్కడికి వచ్చి కొంత కాలం ఉంటూఉంటాడు.



షాంగ్-తు అనే నగరంలో మరొక పెద్ద హర్మ్యం ఉన్నది. దీనిని కుబిలాయిఖాన్ కట్టించాడు. ఈ మహాభవనాన్ని చలవరాతి తోనూ, ఇతర అరుదైన శిలలతోనూ కట్టారు. భవనం లోపల అంతటా బంగారు పూత పూశారు, వైభవంగా అలంకరించారు. ఈ భవనం వెనక ఒక బ్రహ్మాండమైన ఉద్యాన వనం ఉన్నది. అందులో పెద్దఖాను అచ్చుగా వెదురు వాసాలతో ఇంకొక పెద్ద భవంతి కట్టించాడు. ఇదికూడా అత్యద్భుతంగా తయారుచేయబడినది. దీనిని కావాలంటే విప్పి పెట్టవచ్చుకూడానూ.

జూన్, జులై, ఆగస్టు మాసాలు ఆ ప్రాంతాన వేసవి కాలం. ఈ మూడు మాసాలూ పెద్దఖాను షాంగ్-తులో గడుపు తాడు. ఇక్కడ చల్లగా ఉంటుంది. ఆగస్టు 28న పెద్దఖాను వెళ్ళిపోయేటప్పుడు వెదు ళ్ళతో కట్టిన మహలును విప్పేస్తారు. పెద్ద ఖాను ప్రతి ఏడూ ఆగస్టు 28నే ప్రయాణ మయేవాడు. అది దైవజ్ఞులు నిర్ణయించిన ముహూర్తం.

పెద్దఖానుల వశంలో అతి పవిత్రంగా భావించబడే తెల్ల గుర్రాల మందలుండేవి. వాటి సంతతిలో ఏ ఒక్కదాని శరీరంపైనా ఆపగింజంత మచ్చకూడా ఉండేదికాదు. ఈ మందలలో ఆడగుర్రాలే పదివేలకు పైగా ఉండేవి.







కుబిలాయ్‌ఖాను వద్ద టిబెట్టు, కాశ్మీర దేశాలకు చెందిన తాంత్రికు లుండేవారు. వీరు పెద్దఖాన్‌పైన మాత్రం వర్షం పడకుండా చెయ్యగలిగేవారట. వీరు ఎప్పుడూ భస్మం ధరించి ఉండేవారనీ, బలవన్మరణం పొందిన శవాలను తీసుకుపోయి వాటితో క్షుద్రదేవతారాధన చేసేవారనీ మార్కో తెలుసుకున్నాడు.

కుబిలాయ్ వద్ద "బఖ్షీ" లని మరొక రకం మాంత్రికులుండేవారు. పెద్దఖాను భోజనానికి ఎత్తయిన వేదికపైన కూచునేవాడట. ఆయన కూచున్న బల్లకు పది అంగల దూరంలో నేలపైన లోటాలనిండా సారా, పాలూ, ఇతర పానీయాలూ ఉండేవట. అప్పుడు "బఖ్షీ"లు తమ మంత్రశక్తి చేత ఈ లోటాలన్నీ తమంతట తామే గాలిలో లేచి పెద్దఖాను వద్దకు వెళ్ళేలాగ చేసేవారట. పదివేలమంది సమక్షంలో వారీ శక్తులు ప్రదర్శించేవారట. ఇందులో అవగింజంత అయినా అబద్ధం లేదని మార్కో వచించాడు.

ఈ "బఖ్షీ"లు దేవతలకు ప్రియమైన దినాలు వచ్చినప్పుడు పెద్దఖాను సహాయంతో గొప్పగా ఉత్సవాలు చేసేవారు. వారు తమతమ హోదానుబట్టి భార్యలను కూడా చేసుకునేవారు. కాని "సియెన్-సెంగ్" అనే మరొక రకంవారు సన్యాసులు. వారు తలలు గొరిగించుకుని, ధాన్యం పై పొట్టుమాత్రమే తిని, ఉపవాసాలతో జీవిస్తూ బ్రహ్మచర్యం అవలంబించేవారు. నలుపు, నీలిరంగులు గల నారబట్టలు ధరించేవారు. ఎప్పుడైనా పట్టుబట్టలు కట్టినా, ఆ రంగులు కలవే కట్టేవారు. వీరు శక్తి ఉపాసకులై ఉండవచ్చు, ఎందుకంటే వారు ఆరాధించే దేవతల పేర్లన్నీ ఆడవేనట. ప్రపంచంలో అంత కఠోరమైన జీవితం గడిపేవారు మరెక్కడా ఉండరని మార్కో భావించాడు.

—(ఇంకావుంది)





## 6

కుబిలాయ్ ఖాన్ కొలువులో ఉంటూండగా మార్కోపోలో రాచకార్యంపైన పడమటి దిక్కుగా నాలుగు మాసాల ప్రయాణం చెయ్యవలిసివచ్చింది. ఖాన్-బాలిక్ (పీకింగ్) నుంచి బయలుదేరిన మార్కోకు మూడు వారాల ప్రయాణం తరవాత కాయ్-చు దుర్గం తగిలింది. ఈ దుర్గాన్ని పూర్వం బంగారు రాజు అనేవాడు నిర్మించాడు.

బంగారు రాజు శక్తిమంతుడు. ఆయనకు పరిచర్యలు చెయ్యటానికి అందగత్తెలయిన యౌవనవతులు మాత్రమే ఉండేవారట. ఇలాటి యువతులు ఎందరో ఈయన కొలువులో ఉండేవారు. ఈయన తన భవనపు పరిసరాలలో ఒక తేలికైన రథంపై కూచుని, ఆ అమ్మాయిల చేత రథాన్ని లాగించుకుంటూ వాహ్యాళి వెళ్ళేవాడట!

ఈ బంగారు రాజు కావటానికి ఉంగ్ ఖాన్ (ప్రెస్టర్ జాన్) సామంతు; అయినా బలవంతుడననే అహంకొద్దీ ఉంగ్ ఖాన్‌ను ధిక్కరించాడు. ఇద్దరిమధ్యా యుద్ధం జరిగింది. కాని ఈ యుద్ధంలో ఉంగ్ ఖాన్ బంగారు రాజును ఓడించలేకపోయాడు, ఎందుకంటే ఆయిన దుర్గం అభేద్యమైనది.

ఉంగ్ ఖాన్ ఆగ్రహావేశంతో కుమిలిపోసాగాడు. అప్పుడు ఆయన భృత్యులు ఏడుగురు బంగారు రాజును ప్రాణాలతో పట్టి తెచ్చి తమ ప్రభువుకు వప్పగించగల







మని ప్రతిజ్ఞ చేశారు. ఉంగ్ ఖాన్ ఇందుకు ఎంతో సంతోషించి, వారు ఆ పని చేయ గలిగే పక్షంలో వారిని తగినవిధంగా బహూక రిస్తానన్నాడు.

ఆ ఏడుగురూ బయలుదేరివచ్చి బంగారు రాజు కొలువులో ప్రవేశించి రెండేళ్ళపాటు ఆయనకు సమస్తోపచారాలూ శ్రద్ధాభక్తులతో చేసి, ఆయన అనుగ్రహాన్ని పూర్తిగా సంపాదించుకున్నారు. బంగారు రాజు వారి యందు ఎంత విశ్వాసం ఉంచాడంటే, తన కొడుకులనుకూడా అంతకంటె విశ్వసించి ఉండడు. తాను వేటకు వెళ్ళినప్పుడల్లా వారిని వెంటబెట్టుకు వెళ్ళేవాడు.



ఒకసారి ఆయన వేటకుపోతూ ఈ ఏడుగురు భృత్యులనూ, కొద్ది పరివారాన్నీ వెంటబెట్టుకు వెళ్లాడు. రాజభవనానికి ఒక మైలు దూరంలో వారికొక నది అడ్డువచ్చింది. పరివారాన్ని నదివద్ద విడిచి రాజూ, ఏడుగురు భృత్యులూ నది దాటారు. ఇటువంటి అవకాశం కోసమే ఆ ఏడుగురూ కనిపెట్టుకుని ఉన్నారు. ఇప్పుడు బంగారు రాజు వారి అధీనంలో ఉన్నాడు, ఆయనను కాపాడేందుకు ఒక్క పురుగుకూడా లేదు.

వాళ్ళు కత్తి పిడులపైన చేతులు పెట్టి, "మావెంట వస్తావా? చస్తావా?" అని అడిగారు. రాజు వారి చర్యకు నిర్ఘాంతపోయి, "ఇదేమిటి? నన్ను మీ వెంట ఎక్కడికి రమ్మంటున్నారు?" అని అడిగాడు.

"మా ప్రభువైన ఉంగ్ ఖాన్ వద్దకు!" అని వారు జవాబిచ్చారు.

"నాకింత ద్రోహం ఎలా చెయ్యగలిగారు? నేను మిమ్మల్ని కన్న కొడుకులకన్న ఎక్కువగా చూసుకున్నానే! తిన్న ఇంటి వాసాలు లెక్కించటంకన్న ద్రోహం ఉన్నదా?" అన్నాడు బంగారు రాజు.

"అయితే అయింది!" అంటూ వారు బంగారు రాజును ఉంగ్ ఖాన్ వద్దకు తీసుకుపోయారు.









ఉంగ్ ఖాన్ బంగారు రాజును చూసి, "నువు రావటం నాకు పరమానందంగా ఉంది. నీకు ఎలాటి స్వాగతం లభించేదీ తెలుసా?" అని అడిగాడు.

బంగారు రాజు ఏమనాలో తెలియక మౌనంగా ఉండిపోయాడు. ఉంగ్ ఖాన్ అతడిని పశువుల కాపరిగా నియమించాడు.

పాపం, రెండేళ్ళపాటు బంగారు రాజు పశువుల కాపరిగా పని చేశాడు. అంత కాలమూ అయనపై రాజభటులు నిఘా ఉంచారు. రెండేళ్ల అనంతరం ఉంగ్ ఖాన్ ఒకనాడు బంగారు రాజును పిలిపించి, రాజోచితమైన దుస్తులిచ్చి సత్కరించాడు. "నాతో కయ్యానికి కాలు దువ్వటం కూడని పని అని ఇప్పటికైనా తెలిసిందా, మహా రాజా?" అని ఆయన అడిగాడు.

"అవును, ప్రభూ! మిమ్మల్ని ఎదిరించి నిలబడగలవాడెవడూ లేడని నాకు ఎప్పుడూ తెలుసును," అన్నాడు బంగారు రాజు.

"అదే నాకు కావలిసింది," అంటూ ఉంగ్ ఖాన్ బంగారు రాజుకు ఒక గుర్రాన్నీ, కొంత పరివారాన్నీ ఇచ్చి సాగనంపాడు.

* * *

మార్కోపోలోకు తగిలిన మరొక నగరం వోచాన్. దీనిని గురించి కూడా ఒక కథ




ఉన్నది. 1272 కు పూర్వం బెంగాలు బర్మా దేశాలకు ఒక రాజు ఉండేవాడు. ఆయన పెద్దఖానుకు లోబడినవాడు కాడు. వోచాన్‌కు దాడి భయం ఉన్నదని తెలిసి పెద్దఖాన్, నస్రుద్దీన్ అనే తాతార్ నాయకుడి కింద కొంత సేనను పంపి వోచాన్ వద్ద ఉంచాడు.

ఈ సేనను ఎదిరించి పోరాడటం తన ధర్మంగా భావించి బెంగాలు-బర్మా రాజు అఖండమైన సేనతో బయలుదేరి వచ్చాడు. ఆ సేనలో రెండువేల అంబారీ ఏనుగు లున్నాయి; ఒక్కొక్క అంబారీలోనూ 12 మొదలు 16 మందిదాకా యోధులు ఎక్కారు. ఈ ఏనుగులుగాక ఈ సేనలో





40 వేలమంది యుద్ధ భటులున్నారు. వీరిలో హెచ్చుమంది అశ్వికయోధులు.

ఈ సేనను చూసి నజ్రుద్దీన్ నిర్విణ్ణుడయాడు; అతనికింద 12 వేలమంది అశ్విక సైనికులు మాత్రమే ఉన్నారు. అయినా అతను తన సేనలను యుద్ధోన్ముఖం చేసి కాగలదానికి ఎదురుచూస్తూ ఉన్నాడు. బెంగాలు రాజు సేనలు తలపడటంతోనే తాతార్ యుద్ధాశ్వాలు ఏనుగులకు వెరిచి, పరిసరారణ్యాలలోకి పారిపోయాయి.

ఇదీ ఒకవిధంగా మంచిదే అయింది. తాతార్ సైనికులు చెట్లమాటున తమ గుర్రాలనుండి దిగి బెంగాలు - బర్మా సైన్యంపై బాణవర్షం కురిపిస్తూ ఏనుగులను తీవ్రంగా గాయపరిచారు. ఏనుగులు బాధతో ఘీంకరిస్తూ చెల్లాచెదురుగా పరిగెత్తసాగాయి. వాటితోబాటు గుర్రాలుకూడా పరిగెత్తాయి. ఆ క్షణంలోనే తాతార్ సైనికులు తమ గుర్రాలపై లంఘించి వెన్నంటారు.

ఉభయపక్షాలా అంబులు అయిపోయాయి. గదలతోనూ, కత్తులతోనూ దొమ్మి యుద్ధం సాగింది. ఈ యుద్ధంలో రాజు సేనలు చావుదెబ్బ తిన్నాయి. రాజూ, చావగా మిగిలిన యోధులూ పరారీ అయారు. లేకపోతే వారుకూడా ప్రాణాలు కోల్పోయేవారే.

తాతార్‌లు ఏనుగులను పట్టుకుందామని అడవి చెట్లు వాటి దారికి అడ్డంగా పడేశారు, ఇంకా ఎన్నో ప్రయత్నాలు చేశారు. కాని ఈ ప్రయత్నాలన్నీ వ్యర్థమయాయి. చిట్టచివరకు, యుద్ధఖైదీలుగా చిక్కిన రాజు సైనికులే తాతార్లకు కొన్ని ఏనుగులను పట్టి ఇచ్చారు. ఈవిధంగా తాతార్లకు సుమారు రెండువందల ఏనుగులు దొరికాయి.

అది మొదలు పెద్దఖాను వెంట పుష్కలంగా ఏనుగులుకూడా వుంటూవచ్చాయి.

ఈ యుద్ధం జరిగిన కొద్దికాలానికి బెంగాలు-బర్మా రాజు పెద్దఖాను ఏలుబడిలోకి రావటం జరిగింది. —(ఇంకావుంది)



## 7

కౌరామోరాన్ నదికి దక్షిణంగా మంజీ అనే గొప్పదేశం ఉండేది. ఇది సిరిసంపదలతో తులతూగుతూ ఉండేది. ఈ దేశాన్ని పెద్ద ఖాను జయించక పూర్వం ఫక్ఫూర్ అనే రాజు పాలించుతూ ఉండేవాడు. ఒక్క పెద్దఖానును మినహాయిస్తే ఫక్ఫూర్‌ను మించిన రాజు ఎక్కడా లేడని చెప్పవచ్చు.

ఈ రాజు ఆదర్శప్రాయంగా తన ప్రజలను పరిపాలిస్తూ ఉండేవాడు పేదల యెడ ఎంతో ఆదరంగా ఉండేవాడు. బీదవాళ్లు బిడ్డలను కని, పోషించలేక విడిచిపెట్టినట్టయితే ఈ రాజు ఆ బిడ్డలకు జాతకాలు రాయించి అనాథ శిశుపోషణాలయాలలో ఉంచి దాదులచేత పోషణ చేయించేవాడు. ఇటువంటి శిశు శరణాలయాలు ఆ దేశంలో ఎన్నో ఉండేవి. వాటిలో 20 వేలమంది శిశువులు పెరుగుతూ ఉండేవారు.

ఈ రాజుగారికి ఇంకొక చిత్రమైన అలవాటుండేది. ఆయన సవారీఅయి వెళ్లేవారిలో రెండు మంచి భవంతుల మధ్య ఒక పూరి ఇల్లు కనిపించినట్టయితే, అది అలా ఎందుకున్నదో విచారించి, మధ్య ఇల్లు కలవాడు పేదవాడని తెలిసినట్టయితే తన ఖర్చుతో మధ్య ఇంటిని ఇరుపక్కలా ఉండే ఇళ్లతో సమంగా కట్టింపించేవాడు.

అయితే ఈ రాజులో ఉండిన ఒక్క లోటూ ఏమిటంటే ఆయన యోధుడు కాడు.








ప్రజలుకూడా యుద్ధం చెయ్యటం తెలిసిన వాళ్లు కారు. ఈ మంజీదేశం అనాదిగా శాంతి సౌఖ్యాలు అనుభవిస్తూ ఉండటమే దీనికి కారణం. ఈ దేశంపైకి ఎన్నడూ ఎవరూ దాడిచేసి ఉండలేదు. ఈ దేశంలోని ప్రతి నగరమూ లోతయిన నీటి అగడ్తలతో చుట్టబడి ఉండేది. నగరం దాటటానికి వంతెనలుండేవి. శత్రుబలాలు ఈ అగడ్తలను దాటివచ్చి నగరాలపై పడటం దాదాపు అసంభవంగా ఉండేది.

మంజీ ప్రజలు యోధులు కాకపోవటమూ, ఆ దేశంలో కనీసం గుర్రాలుకూడా లేకపోవటమూ మూలాన పెద్దఖాను ఈ



దేశాన్ని జయించగలిగాడుగాని లేకపోతే ఇది ఆయనకు సాధ్యం కాకపోను. ఇది అంతా ఇలా ఉండగా జ్యోతిష్కులు ఈ దేశం గురించి ఒక జోస్యం చెప్పారు: నూరు కళ్ళవాడు వచ్చేదాకా దేశానికి శత్రుభయం ఏమీ లేదన్నారు.

పెద్దఖాను అయిన కుబిలాయ్‌ఖాన్ కింద పన్నెండుగురు శక్తిమంతులైన సామంతులుండేవారు. వారిలో బయాన్ చింగ్ సియాంగ్ ఒకడు. క్రీ శ. 1268 లో పెద్ద ఖాను ఈ బయాన్ వెంట అంతులేని అశ్విక బలమూ, కాల్బలమూ ఇచ్చి, అనేక పడవలు కూడా అయత్తపరిచి మంజీ రాజ్యాన్ని గెలుచుకురమ్మని పంపాడు.

పడవల సహాయంతో నదులను దాటుతూ బయాన్ మంజీ రాజ్యాన్ని చేరవచ్చి, మొట్ట మొదటగా హ్వాయ్-గ్నాన్-చౌ అనే నగరం చేరి, పెద్దఖానుకు లొంగిపోవలిసిందని ప్రజలను ఆదేశించాడు. ఆ నగరంలోని ప్రజలు ఇందుకు పూర్తిగా నిరాకరించారు. బయాన్ వారినేమీ చెయ్యక మరొక నగరానికి వెళ్ళాడు; ఆ నగరంవాళ్ళు కూడా లొంగిపోవ నిరాకరించారు. ఈవిధంగా అయిదు నగరాలచేత నిరాకరించబడిన బయాన్ ఆరో నగరంపైన పడి ఆక్రమించు







కున్నాడు. అతను ఈ నగరంలోని ప్రజల నందరినీ చంపేశాడనికూడా చెబుతారు.

బయాన్ మొదటి అయిదు నగరాలనూ ఉపేక్షించటానికి కారణం లేకపోలేదు. పెద్ద ఖాను వెనకగా మరొక బ్రహ్మాండమైన సేన పంపుతున్నాడని అతనికి తెలుసు. ఆ అయిదింటినీ విడిచిపుచ్చిన బయాన్ పన్నెండు నగరాలను వరసగా జయించి, మంజీ రాజధాని అయిన కిన్సాయ్ నగరానికి వెళ్లాడు. రాజూ రాణీ ఈ కిన్సాయ్ నగరం లోనే ఉండేవారు.




రాజు భయపడి, వెయ్యి పడవలలో తన బలగాన్ని ఎక్కించుకుని సముద్రంలోని దీవులకు పారిపోయాడు; ఆ దీవులనుంచి ఆయన మరి తిరిగి రానేలేదు. ఈ లోపల రాణి మాత్రం నగరంలోనే ఉండి బయాన్ దాడిని నిరోధించటానికి యత్నించింది. ఇంతలో ఆమెకు తమ శత్రుసేనాని పేరు బయాన్ అని తెలియవచ్చింది. బయాన్ అంటే నూరు కళ్లు గలవాడని అర్థం. ఆమెకు జోస్యం జ్ఞాపకం వచ్చి నిరుత్సాహం ఏర్పడి, వెంటనే బయాన్‌కు లొంగిపోయింది.

ఎప్పుడైతే రాజధాని పెద్దఖానుకు లొంగి పోయిందో అప్పుడే మంజీలోని మిగిలిన నగరాలన్నీ లొంగిపోయాయి. ఒక్కటే ఒక్క నగరం లొంగలేదు; దానిపేరు సియాంగ్-యాంగ్-ఫూ. మంజీ యావత్తూ పెద్దఖానుకిందికి వచ్చిన మూడేళ్ల అనంతరం ఈ నగరం ఇంకా పెద్దఖాను సేనల ముట్టడిని ప్రతిఘటించుతూనే ఉండింది.

ఇది ఎలా సాధ్యమయింది? పెద్దఖాను బలాలు ఈ నగరాన్ని ముట్టడించికూడా ఎందుకు లొంగదీసుకోలేకపోయాయి?

ఈ నగరానికి మూడువైపుల ఒక లోతైన సరస్సు ఉండి శత్రుభయం లేకుండా కాపాడుతూ ఉండేది. ఒక్క ఉత్తర పార్శ్వాన్నిమాత్రమే పెద్దఖాను బలాలు ముట్టడించాయి. నగరవాసులు సహజంగా





ఈ ముట్టడిని ఖాతరు చెయ్యలేదు. ఎందు కంటే వారికి కావలిసిన సంబారాలన్నీ నీటిమీదుగా వారికి చేరుతూవచ్చాయి. అందుచేత ముట్టడి పూర్తిగా విఫలమయింది. పెద్దఖాను కొలువులో ఉన్న పోలోలు—మార్కో, అతని తండ్రులూ—సహాయపడక పోయినట్టయితే సియాంగ్-యాంగ్-ఫూ ఎన్నటికీ పెద్దఖానుకు లోబడేదికాదు.

ఒకనాడు సియాంగ్-యాంగ్-ఫూనుంచి కొందరు మనుషులు పెద్దఖానువద్దకు తిరిగి వచ్చి, మూడేళ్ళుగా నడిచిన ముట్టడి ఎందుకూ కొరగాకపోయిందని విన్నవించారు.

"ఈ నగరాన్ని జయించటానికి ఏదో ఒకటి చేయాలిగద!" అన్నాడు పెద్దఖాను.

అప్పుడు పోలోలు ఆ నగరాన్ని జయించే సాధనం ఒకటి ఉన్నదనీ, దానిని నిర్మించ గలవారు తమవెంట ఉన్నారనీ పెద్దఖానుకు విన్నవించారు. అది రాళ్లను విసిరే యంత్రం—వంద వీశెల బరువు గల కొండరాళ్ళను సయితం, వడిసెలలాగా, ఎంతో దూరం విసరగలదు.

"అయితే అలాటి యంత్రాన్ని వెంటనే తయారుచేయించండి!" అని పెద్దఖాను పోలోలకు ఉత్తరువిచ్చాడు. పోలోల పరివారంలో ఈ యంత్రాలు చెయ్యగలవాళ్ళు ఇద్దరున్నారు. వారు త్వరలోనే మూడు వడిసెల యంత్రాలను తయారుచేశారు. పెద్దఖానూ, అతని పరివారమూ వాటి ప్రయోగాలను చూసి ఆనందపరవశులయారు.

పెద్దఖాను సైనికులు ఈ యంత్రాలను సియాంగ్-యాంగ్-ఫూ వద్దకు చేరవేశారు. ఒక్క యంత్రంనుంచి విసిరిన రాయి నగరంలోని ఇళ్లపైన పడి మహోత్పాతం కలిగించేసరికి నగర ప్రజలు బెదిరిపోయి, ఈ ఉత్పాతానికి విరుగుడు లేదని నిశ్చయించుకుని, ఇతర నగరాలు లొంగిపోయిన షరతులమీదనే పెద్దఖానుకు లొంగిపోవటానికి సమ్మతించారు. —(ఇంకావుంది)






మార్కోపోలో సాహసయాత్రలు

# 9

మార్కోపోలో 13 వ శతాబ్దం ఆఖరు దశాబ్దంలో ఇండియాకు వచ్చి ఇక్కడ కొంత కాలం ఉండి, అనేక విషయాలు చూసి వాటిని తన గ్రంథంలో రాశాడు. ఈ వివరాలతో ఈ యాత్రల కథ ముగింతాము.

అతను మన దేశం గురించి రాసిన వివరాలు ఇవి:

"సింహళంనుంచి 60 మైళ్ళు సముద్ర ప్రయాణం చేస్తే మాబారు (చోళ) దేశం వస్తుంది. ఈ దేశాన్ని అయిదుగురు స్వతంత్ర రాజులు పరిపాలిస్తున్నారు. మాబారు దేశానికీ సింహళానికీ మధ్య ఉండే సింధుశాఖలో ముత్యాలు దొరుకుతాయి. ప్రపంచంలో ఉండే ముత్యాలలో హెచ్చుభాగం ఇక్కడే దొరుకుతాయి. ఇక్కడ సముద్రం అట్టే లోతు ఉండదు. కొందరు వర్తకులు కలిసి ఒక పడవ చేసుకుని ఇక్కడికి వస్తారు. ఇలాటి పడవలు చాలా వస్తాయి. ఏప్రిల్ లోనూ, మే మొదటి సగంలోనూ ముత్యాల వేట సాగుతుంది. వర్తకులు ముత్యపు చిప్పలు సముద్రంలోనుంచి తీసుకువచ్చే వాళ్ళను జీతాలిచ్చి తెచ్చుకుంటారు. వీళ్ళు నీటిలో దిగి, అడుగుకు వెళ్ళి ముత్యపు చిప్పలు తెచ్చి వర్తకుల కిస్తారు. ముత్యపు చిప్పలలో చిన్నవీ, పెద్దవీ, రకరకాలైనవీ ముత్యాలుంటాయి. ముత్యపు చిప్పలను పగలదీసి మంచినీటిలో వేస్తే మాంసం పైకి









తేలి ముత్యాలు అడుగుకు పోతాయి. ఈవిధంగా వర్తకులు అసంఖ్యాకమైన ముత్యాలను సంపాదిస్తారు....సముద్రంలో దిగినవారు ఉపద్రవమైన చేపల వాత పడకుండా బ్రాహ్మణులు మంత్రాలు చదివి, వర్తకులు పట్టిన ముత్యాలలో నూరింట అయిదువంతులు పుచ్చుకుంటారు....

"మాబారులో దర్జీలు లేరు. ఎందుకంటే ఇది వేడిదేశం కావటంచేత ఇక్కడివారు దుస్తులు ధరించరు, అంగవస్త్రాలు మాత్రమే ధరిస్తారు. రాజుగారుకూడా అంగవస్త్రమే ధరిస్తాడు. అయితే దాని అంచుల వెంబడి రత్నాలు కుట్టి ఉంటాయి, అందుచేత దాని విలువ అపారం....రాజుగారు ధరించే ఆభరణాలకు అంతు లేదు. వాటికి ఎవరూ విలువ కట్టలేరు. వాటితో ఒక మహానగరం కొనెయ్యవచ్చు. విలువగల ముత్యాలుగాని రత్నాలుగాని తన రాజ్యం దాటి పోకుండా ఈయన శాసనం చేశాడు.

"ఈ దేశంలో గుర్రాల పెంపకం లేదు. అందుచేత హెచ్చుగా ధనం వెచ్చించి అరబ్బీ దేశాల నుంచి గుర్రాలను దిగుమతి చేసుకుంటారు...ఈ దేశంలో భర్త చనిపోయినప్పుడు భార్య అతడి చితిపైన పడి తాను కూడా కాలిపోతుంది. ఇలా చేసేవారు ఉత్తమ స్త్రీలుగా భావించబడతారు... ఇక్కడి ప్రజలు భోజనం చేసేటప్పుడు కుడిచేతిని మాత్రమే ఉపయోగిస్తారు...ఏదైనా తాగేటప్పుడు చెంబు నోటికి తగలనివ్వరు.

"అప్పులవాళ్లు తమ సొమ్ము వసూలు చేసుకోలేకపోయినప్పుడు బాకీ ఉన్నవాడి చుట్టూ ఒక గిరి గీసినట్టయితే ఆ మనిషి సొమ్ము చెల్లించేదాకా ఆ గిరి దాటరాదు. అలా దాటినవాళ్లు మరణదండనకు గురి అవుతారు. రాజుగారికే ఇది తటస్థించటం మార్కో కళ్లారా చూశాడు. రాజుగారు ఒక విదేశీ వర్తకుడికి బాకీపడి అన్న సమయానికి బాకీ చెల్లించలేదుట. ఆ బాకీదారు ఒకనాడు







రాజుగారు గుర్రంమీద వస్తూండగా గుర్రం చుట్టూ గిరి గీశాడు. రాజుగారు డబ్బు తెప్పించి ఆ విదేశీ వర్తకుడికి ఇచ్చినదాకా గుర్రంతోసహా గిరి మధ్యనే ఉండిపోయాడు.

"ఇక్కడివాళ్లు శకునాలు మహా పాటిస్తారు. ముఖ్యంగా ప్రయాణం వెళ్లేవారు అనేక రకాల శకునాలు చూస్తారు. బయలుదేరేవాడు, ఎవరైనా తుమ్మితే వెంటనే కూర్చుంటాడు. రెండో తుమ్ము వినిపిస్తేగాని లేవడు. రాహుకాలం ఏ పనికీ పనికిరాదు. ఈ రాహుకాలం ఒక్కొక్క రోజు ఒక్కొక్క వేళకు వస్తుంది...ఇక్కడి ఇళ్లనిండా బల్లులుంటాయి. బల్లి పలుకు ఫలితాలను కూడా వీరు పాటిస్తారు."

మార్కోపోలో 1290 లో మోటుపల్లి రేవులో దిగాడు. ఆ సమయంలో రుద్రమదేవి ఆంధ్రదేశాన్ని పరిపాలిస్తూ ఉండేది. ఆమెను గురించి మార్కోపోలో ఈ విధంగా రాశాడు:

"ఈ దేశాన్ని ఏలే రాణి గొప్ప జ్ఞాని. ఈమె భర్త మరణించి పూర్తిగా 40 సంవత్సరాలయింది. ఈమె తిరిగి వివాహం చేసుకోలేదు. ఈ 40 సంవత్సరాలూ ఈమె తన భర్తలాగే రాజ్యాన్ని ఎంతో ధర్మంగానూ, న్యాయంగానూ పరిపాలించింది. ప్రజలకు ఆమెపై గల అనురాగాలు సాధారణంగా ఏ రాజుకూ, రాణికీ ఎవరూ చూపిఉండరు.

"ఈ రాజ్యంలో వజ్రాలు దొరుకుతాయి. వానలు కురిసి కొండలపైనుండి వాగులు ప్రవహించినప్పుడు వజ్రాలు రాళ్లనుండి విడివడి కొట్టుకువస్తాయి...ప్రపంచంలో వజ్రాలు దొరికేది ఈ రాజ్యంలో మాత్రమే. మేలిరకం వజ్రాలు ఇక్కడినుండి పెద్ద ఖానుకూ, ఇతర మహారాజులకూ పోతాయి. ఎందుకంటే వీటిని సామాన్యులు కొనలేరు...ప్రపంచంలోకెల్లా మేలిరకం దుప్పటిగుడ్డ (బక్రమ్) ఇక్కడ ఉత్పత్తి అవుతుంది. దీనిని ధరించటానికి మహారాజులూ, మహా







రాణులూ సయితం ఉబలాటపడతారన్న మాట. ఇక్కడ పశు సంపద జాస్తి. ఇక్కడ ఉండేటంత పెద్ద గొర్రెలు ప్రపంచంలో ఎక్కడా లేవు...

“ఈ దేశంలో లాడ్ రాజ్యం అని ఉన్నది. వైశ్యులందరూ ఇక్కడే పుడతారు. ప్రపంచంలో వీరిని మించిన వర్తకులుగాని, నమ్మకస్తులుగాని లేరు. విదేశాలనుండి వర్తకులు వచ్చినప్పుడు వీరు వాళ్ళ సరుకు స్వాధీనం చేసుకుని, వారికి ఈ దేశపు ఆచార వ్యవహారాలు తెలియకపోయినప్పటికీ, వారి సరుకులను న్యాయమైన ధరలకు అమ్మి, వారి కోసం ఇతర సరుకులు న్యాయమైన ధరలకు కొనిపెడతారు. ప్రతిఫలంకూడా కోరరు, కృతజ్ఞతాపూర్వకంగా ఏమైనా ఇస్తే పుచ్చుకుంటారు. వీరు మాంసం తినరు, సారా తాగరు. ఎంతో నీతిగా జీవిస్తారు. జీవహింస చేయరు, దాన్ని మహాపాపంగా పరిగణిస్తారు. వీరు చోళదేశంనుంచి మేలి ముత్యాలు తెచ్చి తమ రాజుకు అమ్ముతారు. రాజుకు వారు తాము ఇచ్చిన ధర చెబుతారు. రాజు వారికి రెట్టింపు ధర ఇస్తాడు....

“ఇండియాదేశంలో ప్రజలందరూ తాంబూలం సేవిస్తారు. కులీనులలో ఈ అలవాటు మరీ జాస్తి. తాంబూలంలో వారు సున్నంతోబాటు కర్పూరం మొదలైన అనేక సుగంధ ద్రవ్యాలు వేసుకుంటారు....

“ఇండియాలో ఆఖరు రాజ్యం నెచ్-మక్రాన్. ఇక్కడ మహమ్మదీయులు జాస్తి. ఇక్కడ వరితోబాటు గోధుమకూడా జాస్తిగా పండుతుంది...

“మాబారుకూ దీనికీ మధ్య ఉండే దేశం తూర్పు ఖండంలోకెల్లా ఉత్తమోత్తమమైనది. ఇక్కడ ఉండే నగరాలన్నిటినీ గురించి చెప్పటం సాధ్యమయే పనికాదు...”

—(అయిపోయింది)



